# తొలి పలుకు



ఆర్యులారా!

నేనాంధ్రభాషయందు తీక్ష్ణుడను కాకపోయినను దైవానుగ్రహముచేతను పెద్దల యాశీర్వాద ఫలముచేత నీ మదనజనక శతకమును వ్రాయ బూనితిని.

ఈ శతకంబునందు "నీదుదయకొంత దానిపై । నిలిపిమైన। మనుపునీయందు మరులొంద । మదనజనక" యని మకుటము బెట్టుటకు కారణంబే మనపూర్వులు

"మనసా హరిపాదములాశ్రయింపుమా"
"శ్రీహరిపదంబులు కోరిభజించు చిత్తమా"

అని యనేకవిధములుగా ననేక గ్రంథములందు మనస్సును సంబోధించి చెప్పుటచే నించుక సందియంబొదవె. ఎందుచేతనన మనంబునకు చలనంబు స్వాభావిక ధర్మమైయుండగా దాని ధర్మమును విడుచుట కది యసమర్థతగలదిగాన నట్టి యస్థిరమై

సదానిని స్థిరపడుమాయని బోధించుటలో ఫలిత మేమియును గాన్పింపమి, సర్వ క_ర్తయగు నప్పర మేశ్వరునితో దీనిచర్య నెరింగించిన నాతడు చక్క జేయగలడనుతలంపుతో పై మకుటము వ్రాసితిని.

నావ్రాతయందుగాని, నా యభిప్రాయము నందుగాని లోపములున్నచో పండితులు తెలియ జేసినచో వినయపూర్వకముగా నామోదించి సవ రణల జేసికొందునని విన్నవించుచున్నాడను.

నా శతక లోపములను సరిచేసిన విద్వాన్ శ్రీ నిరోగి రామమూర్తి శాస్త్రిగారికి నా వంద నములు.

ఇట్లు

విద్వజ్జన విధేయుడు,

అడపా అప్పలస్వామి.

శ్రీ

# —•మదనజనక శతకము•—

సీ॥ శ్రీలలనాలోల• సేవకపరిపాల!
వీనదేల నీకథల• వెఱ్ఱిమనసు
నీ మంగళాకృతి• నేర్పుతో జూడంగ
నోరదెప్పుడదేమొ• కొంటెమనసు
మహనీయచరిత! నీ• మధుర నామామృత
పానంబు సేయదు• భ్రష్టమనసు
లక్ష్మీశ! నీయందు• లక్ష్యముంచకలేక
విచ్చలవిడి చను• తుచ్ఛమనసు
గీ॥ కాల మీరీతి గడుపుచు• గడకు నిన్ను
జేరనేరదు వెయ్యేల• చెడుగుమనసు
నీవు దయకొంత దానిపై• నిలిపియైన
మనుపు, నీయందు మరులొంద• మదనజనక 1

సీ॥ పరమేశ! నీపైని• పద్యశతంబును
జెప్పనెంచితిగాన• చిత్తగింపు
యతి గణ ప్రాసల• స్థితుల నెరుంగను
కావ్యంబులైన నే• గరచియెఱుఁగ
శాస్త్రంబులైన నే• జదివియెఱుంగను
అమరకాండంబుల• నరయలేదు

నీ కృపతో కొడుగా ♦ నే రచించితిగాని
కాకున్న నేనొక్క ♦ కవినె చెపుమ?
గీ॥ మనవిచేసెద విన్నప ♦ మవధరింపు
మాయయుతమైన నామది ♦ మరచెనిన్ను... 2

సీ॥ వరద! నీ వైకుంఠ ♦ పురి జేరదగనట్టి
కూరకర్మల జేరు కుటిలమనసు
కరుణాలవాల! నీ ♦ శరణాగతత్రాణ
బిరుదెరుంగక చెడు ♦ బేలమనసు
భక్తవత్సలుడవై ♦ పరిబలితివంచు దా
భావమందెరుగదు ♦ భ్రష్టమనసు
పతితపావన! నీదు ♦ బలుశక్తి దెలియక
బతితమై చెడుగదా ♦ పాడుమనసు
గీ॥ పేర్మి యొక్కింతయుంచదు ♦ పేదలందు
ముందుగతి జూడదేమందు ♦ నిందిరేశ!.. 3

సీ॥ దీని వెఱ్ఱియుగూల ♦ దిక్కుమాలినమది
పానజూదములపై ♦ భ్రాంతివిడదు
పెద్దలనిందించ ♦ బెట్టినదే పేరు
చోరవృత్తికి జాల ♦ చురుకుజూపు
జీవహత్యల జేయ ♦ జెలరేగుచుండును
దానధర్మంబుల ♦ దలచదెపుడు
కల్పనాకథలైతె ♦ కడు శ్రద్ధగా విను
గాని వినదు నీదు ♦ ఘనచరిత్ర

గీ॥ తలచ నేరదు నిన్ను నో♦ధన్యచరిత!
గాన నీవైన యుంచుక♦కరుణతోడ... 4

సీ॥ తప్పుసాక్ష్యములకు♦గుప్పిగంతులువైచు
నారాయణ!నుమన్న♦నాగ్రహించు
నాథుల బాధింప♦జాల తా నప్పొంగు
మాధవా! యనుమన్న♦ఖేద మొందు
కొండెముల్జెప్పంగ♦నిండు వేడుకనొందు
గోవింద! యనుమన్న♦గోడు సెందు
తుంటరిపనులన్న♦వెంట నేప ర్వెత్తు
పరమేశ! యనుమన్న♦పరితపించు
గీ॥ నిహ పరంబుల సుఖ మొంద♦నెరుగ లేక
భ్రమసి తిరిగెడుమది దాని♦భ్రమనుమాన్పు...

సీ॥ సత్యవాక్యములాడ♦సాహసించదు మది
యనృతంబులాడుట♦కడ్డు లేదు
జారాంగనలయిండ్ల♦జేర జూచునుగాని
కోరి నీ తావు తా♦జేర దెపుడు
భక్తవర్యులు నీదు♦భజన సేయగజూచి
భావమందు త్సాహ♦పడగ బోదు
పుణ్యతీర్థములకు♦బోవు వారినిజూచి
యేలబోయెదరని♦గేలి సేయు
గీ॥ దివ్యక్షేత్రంబులకునైన♦దిరుగబోదు
తిరుగువారిని కనగొన్న♦మొరుగుచుండు...6

సీ॥ ఏమహాగుణశాలి♦యెల్లజగంబుల
లీలార్థముగ జేసి♦యేలుచుండె
నామహాయశునకు♦నల్లారుముద్దుగా
దిరుగ నేర్చిన నీకు♦దిక్కుగల్గు
కల్లజగంబులో♦నెల్లకాలము నీవు
చర్వితచరణమై♦జరుగుకంటె
తలిదండ్రియును నీవె♦తప్పుగాప్పుమటంచు
విన్నవించుమటన్న♦వినదుమనసు
గీ॥ ఎటుల గననేర్చునీరూప♦మేదితోఁ౯వ
ముప్పు తెల్లారుటెట్టులో♦ముని శరణ్య!... 7

సీ॥ భయమేల మనస! నీ♦బాములన్నియుదీర్చు
భజియించు హరినన్న♦బధిరయగును
గరుడధ్వజుడు నిన్ను♦గాచు వేడుమటన్న
గమనించదామాట♦గర్వియగుచు
శ్రీనివాసుడు నిన్ను♦జేరదీయును వేగ
సేవజేయుమటన్న♦చెవినినిడదు
పాలాత్మనతుడు నీ♦పై జాలదయబూను
బటుభక్తినుండన♦బలుకకుండు
గీ॥ నిట్టి గుణయుత మరిదీని♦కెట్టులైన
పటుతరంబైన సుగుణాత♦బట్టునట్లు... 8

సీ॥ మర్యాదగానీవు♦మన గలింగిలి వేని
మాధవుం డాధ్యాండు♦మనస! వినుమ

వానికన్నను వేరె • వరదు డెవ్వడు లేడు
వాదంబుమాని నీ • వతని కొరకు
వెదకితి వేని నీ • వెతలన్ని యును దీర
గానవచ్చును గాక • గాఁ బవించు
ఎరుగ లేకిన్నాళ్లు • తిరుగు చుంటివి గాన
సకలాఘములు బోవు • సమయ మొదవె
గీ॥ జాగు సేయక లేలెమ్ము • జంకు విడిచి
యనిశ విన దేమి సేయుదు • వనజనయన!... 9

సీ॥ శ్రీరమారమణుడే • శ్రీరాముడను పేర
దశరథోర్వీశుని • తనయుడగుచు
క్రతురక్షణము సేయ • గా కౌశికునితోడ
జని తాటకను దాని • జంపి పిదప
మిథిల కేతెంచుచో • పథమధ్య శిలగని
పడతిగా జేసి యా • పైని శివుని
విలువిఱిచి సీతను • వేడ్కతో జేబట్టి
భార్గవు గర్వంబు • బారదోలి
గీ॥ నట్టి శ్రీరామమూర్తిని • బట్టుకొనుమ
యనుచు నే జెప్ప వినిపించు • కొనదు మనసు

సీ॥ మాధవుం డేక దా • మత్స్యంబు గానయ్యె
గొప్ప కూర్మంబ య్యె • ఘోణియయ్యె
నారాయణుడె గదా • నరసింహమాయెను
వామనుండాయెను • వరుసగాను

పద్మనాభుడెగదా॰పరశురాముండా యె
శ్రీరాముడాయెను॰ఋషులు వొగడ
బలరాముడును బుద్ధ॰కలికిరూపుడున య్యె
నల పరంధాముడే॰యనగ మనసు
గీ॥ నీదు యవతారమహిమల॰నెరుగ లేదు
చెప్పిననుగాని వాటిదా॰చెలగివినదు... 11

సీ॥ మాయతో జతగూడి॰మసలుచున్నావు
మర్మ మెరుంగక॰మమతచేత
ఆలుబిడ్డలయందు॰నాశతోనున్నావు
కాలుని గద పెట్లు॰గానలేవు
మోహనాంగులపొందు॰మోసమంచెరుగక
కదిసెదవేల నే॰కాంతసమితి
కుక్కమాదిరి నీవు॰పెక్కుచోట్లకునేగి
నిలువలేవెందొక్క॰నిమిషమైన
గీ॥ చాలునిక నీవు దిరుగుట॰చాలుజాలు
సనుచు మదికెంత జెప్పిన॰యాగివినదు... 12

సీ॥ దైత్యారి! నీయొక్క॰దయ రాకయుండిన
మన సేమొ నీయందు॰మరులుకొనదు
నీలనీరదగాత్రి!॰నీరూపుజూడక
మన సేమొ నీయందు॰మరులుకొనదు
నిర్హేతుకముగాను॰నీవిటురావేని
మన సేమొ నీయందు॰మరులుకొనదు

నాకు దోచినమాట•నంటినిగాని తా
మెఱుగనియంశమూ•మరుగుగలద?
గీ॥ వాదు నీపై నిరాకుండ•వనజనయన!
డెంద మందందుబోకుండ•ముందునిలిచి... 13

సీ॥ క్రైస్తవమతమందు•గలదు మోక్షంబని
యోచించబోకది•యొప్పుగాదు
తురకల మతమందు•నరకంబు లేదని
పలుకబోకదినీకు•పాడిగాదు
వైష్ణవమతమందు•వచ్చు మోక్షంబని
కొద్దియైనను నమ్మ•వద్దు తగదు
అద్వైతమతమందు•నలవడదాముక్తి
ఎన్నాళ్ళకైనను•యెంచి చూడ
గీ॥ కదలకుండిన నన్నింట•గలదు ముక్తి
నమ్ముమీమాయనమదియే మో•నమ్మదామె..14

సీ॥ కరిరాజవరదుని•కాళీయదమనుని
కందర్పజనకుని•కమలవిభుని
కరుణాంతరంగుని•కనకసుచేలుని
కాలస్వరూపుని•కమలనయను
కంస సంహారుని•కమనీయగాత్రుని
కలుషవిదూరు శ్రీ•కంబుకంఠు
కాలకంధరనుతు•కౌసల్య వరసుతు
కదలక మదినిల్పు•కలుగు ముక్తి

గీ॥ యనుచు బహు శ్రద్ధతోడ నే•ననవరతము
బోధసేయంగ చిత్తమాబోధవినదు... 15

సీ॥ ఆడినమాట దా•నమృతంబుగానీదు
ఆర్తరక్షణ బిరు•దాంకితుండు
అతనిపాదంబుల•నాశ్రయించితివేని
అమరాదులకు నంద•నట్టి పదవి
బొందెదవీవు నా•బోధనవింటేని
చెడిపోవ నీకు నే•జెప్పలేదు
నా మాటలందు న•మ్మక మించుకిడితివా
వేరుసేయడతండు•వేగబ్రోచు
గీ॥ నమ్మ ముమ్మాటికీమాట•నమ్మమనుచు
నెమ్మదిగజెప్పినను మది•నమ్మదాయె... 16

సీ॥ అరయంగ సారథై•కురు పాండుదురమున
కరుణతో జిష్ణుని•గాచినాడు
కౌరవుల్కుపితులై•చీరెలువిప్పంగ
ద్రౌపదిమానంబు•దాచినాడు
కుబ్జమువ్వంకలు•కుదురుగాసవరించి
చెన్నుమీరినదాని•జేసినాడు
గాన మానసనీకు•గతి యతడేసుమా!
యెందెందుదిరిగిన•నేమిలేదు
గీ॥ నమ్మి భజియించు రాముని•నవవిధముల
యనిన వినదాయె రాఘవా•యనఘచరిత!...

సీ॥ సామాన్యమానవ • సముడని యొదవేకు
వినువాని బలమును • వీనులలర
బాల్యమందున ఘోర • భండనంబొనరించి
తాటకాది నిశాట • తతిని గూల్చె
వీరులందరు వచ్చి • విలు జూచి వెరగొంద
హరువిల్లు ధీరుడై • యదిమి విరచె
పరశురాముని విల్లు • బట్టి, నారెక్కిడి
యాతని తపమున • కనిపినాడు
గీ॥ మనస! యాతని బలమెన్న • మనకు వశమె?
వానిచేరవె యనినను • వల్లెయనదు.. 18

సీ॥ పదునాల్గు వేల బ • ల్లిదులైన యసురుల
బడనేసె నొకవాడి • బాణమునను
సీరింకి బీడుగా • నెదుట గన్పడజేసె
శరధిపై గినుకను • శరము బూని
దుందుభి యనువాని • దొడ్డ కాయంబును
దాపలి కాలిచే • దన్నె దివికి
సప్తతాళములను • లిప్తలోపల నొక్క
శరమున బడనేసె • సురలు పొగడ
గీ॥ రాము మహిమలు వినియైన • రభసముగను
మనస! యనిశంబు గొనియాడు • మనిన వినదు. 19

సీ॥ గాలిచే నీటిపై • గదులుచుండెడి నావ
కరణిని గదలకే • ఘనముగాదె,

వేదవేద్యుని నెల్ల • వేళల గనలేక
వెతలొందనేల నీ • వెట్టిగూల
మతిని శ్రీయఃపతి • గతియని నమ్మి నీ
వాతని జేరుటీ • రరయుమంటి
నారాయణుని నమ్మ • ధారణి చెడినట్టి
నరమృగాదులు లేవు • నమ్మ మనస !
గీ॥ యనుచు నేనెల్లభంగుల • వినయముగను
చెప్పి వేసారియున్నాను • శేషశయన... 20

సీ॥ ఎండమావులగని • యెండిన గొంతుతో
నేగిన నేమౌనొ • నీవెచూడు
ఆరీతిగా నీవు • నాశజెందితివేని
వీసమైనను నీ • కిహమునందు
సుఖమేది గురునిచే • సూటిదెల్సితెగాని
నిక్కమీమాట చ • క్కంగ నమ్మ
మనస! నీవెటులైన • మంచిదేశికుజేరి
శుశ్రూషలనుజేసి • జూడు స్థిరత
గీ॥ బడయగలవిహపరభోగ • భాగ్యములన
వినియు సద్గురుచరణంబు • వెదకదాయె... 21

సీ॥ ధనధాన్య పశువా • హన సమూహములెల్ల
నప్పుడప్పుడు గల్గి • యవియు తొలగు
దారా సుతాదులు • తగు బంధు మిత్రులు
కలుగుదురొకతరి • గలుగకుండ్రు

పాంచభౌతికమైన ♦ పనికిమాలిన బొంది
యధియు రోగాదుల ♦ కాస్పదంబు
మనస! నీవెదిచూచి ♦ మమతనొందెదు భువి
వాకొనుమీ ? దాని ♦ నూకొనెదను
గీ॥ మాయజతగూడి మరువకే ♦ మారజనకు
ననిన తనకది వినసహిం ♦ పగుటలేదు... 22

సీ॥ కాంతామణులయొక్క ♦ కడుసొంపు వర్ణించి
కామాతురతచేత ♦ గదిసి చెడకు
ధనముచే పనులన్ని ♦ ధరణిలో నగునని
పలువిధంబుల దాని ♦ బడసి చెడకు
పుత్రుల బడసిన ♦ బోవు పాపంబని
పుత్రేషణంబును ♦ బొంది చెడకు
మీషణత్రియముల ♦ కీగిపోయితివేని
మరి రాము గనలేవు ♦ మనస యనిన
గీ॥ ఈషణంబుల దగిలిన ♦ యీహవిడదు
పోషణమ్ముఁజేయు తండ్రిని ♦ భోగిశయన!... 23

సీ॥ సంసారమును రోసి ♦ సన్న్యాసులను డాసి
దేశదేశములెల్ల ♦ దిరుగనేల
ఏకాదశీవ్రతం ♦ బెలమి జేయుచునీవు
నుపవాసముల సుక్కి ♦ యుండనేల ?
తల్లిదండ్రుల సేవ ♦ తవిలి చేయగలేక
నెల్ల దైవంబుల ♦ నేల వెదుక...

ముక్తికాంతను గూడు ♦ యుక్తి దెలియలేక
మర్త్యకాంతల పొందు ♦ మరిగెదేల?
గీ॥ ఆత్మదర్శన మార్గంబు ♦ నడుగు బుధుల
హాయిజెందెదు మనస నీ ♦ వనిశ వినదు... 24

సీ॥ మధుకైటభులబట్టి ♦ మదమణంచినజెట్టి
నినుబట్టి చననీక ♦ నిలుపలేడ?
తులువయా సోమకు ♦ బిలుకుమార్చిన శౌరి
నిన్నడుగిడకొండ ♦ నిలుపలేడ?
వాలి నొక్కమ్మున ♦ గూలనేసిన రాము
డవలీలగా నిన్ను ♦ నాపలేడ?
వానికి కోపంబు ♦ వచ్చు నంతకుమున్నె
కదలక నిలునిలు ♦ కనెదవతని
గీ॥ జెప్పనగునంతవరకు నే ♦ జెప్పినాడ
మనస! నీయిష్టమటుపై ని ♦ యనిన వినదు 25

సీ॥ శ్రీహరీయంచు నీ ♦ చిత్తమందు దలంచు
మాధవా యంచును ♦ మరియు ననుము
విశ్వనాధాయంచు ♦ వినువక నుడువుము
శాశ్వతా యంచును ♦ సతతమనుము
పతితపావనయంచు ♦ బలుమారు నుతియించు
పంకజాక్షాయంచు ♦ బ్రస్తుతించు
స్మరజనకాయంచు ♦ మరువక స్మరియించు
దురితదూరాయంచు ♦ దోసిలొగ్గు

గీ॥ మభయమిచ్చును శ్రీరాము ♦ డనిన మనసు
నటులెఁగావింతుననుచు దా ♦ నాగి వినదు...26

సీ॥ దశరథాత్మజ నీదు ♦ దర్శనంబిప్పించి
దరిఁజేర్చి రక్షించు ♦ దాతవీవె
కనులార నినుజూడ ♦ గలుగు భాగ్యంబిచ్చి
కాపాడుటకునైన ♦ కర్తవీవె
పతితపావన నీదు ♦ పాదంబులర్చించు
పని నాకొసంగెడి ♦ ప్రభుడవీవె
యనిశంబు నిన్ను నే ♦ ననుసరింపగఁజేసి
యభయహస్తంబీయ ♦ నాథ్యుడీవె
గీ॥ యనుచు నుతియించురాముని ♦ ననిన మనసు
తాను మునుపటి మార్గంబు ♦ పూనియుండె...

సీ॥ ఫణిశాయి! నిన్ను నే ♦ పద్మాక్షయంచును
పలుమారుపిలువంగ ♦ పాల్పడినను
గుణమణీ! నిన్ను నే ♦ గోవిందయంచును
గొబ్బునబిలువంగ ♦ గోరియున్న
రణభీమ! నిన్ను నే ♦ రాఘవాయంచును
ననిశంబు నుతియింతు ♦ ననుకొనినను
మణిమయాభరణ! ని ♦ న్మాధవాయంచును
మరిమరి వేడంగ ♦ త్వరపడినను
గీ॥ మనసు, యనుకూలిగాక తా ♦ మసలుకతన
నిన్ను గొసియాడ నవకాశ ♦ మెన్న సున్న...

సీ॥ కౌసల్యవరసుత ♦ కౌశికమఖరక్ష
కౌస్తుభమణివక్ష ♦ కలుషశిక్ష
భాస్కరకులదీప! ♦ భవబంధహరణ! యో
భావజజనక! యో ♦ భక్తవరద!
భువనమోహన! భక్త ♦ పూజితపాదాబ్జ!
భవదీయకృపకు న ♦ న్పాత్రు జేసి
రక్షించు, నీకంటె ♦ రక్షకుల్మరిలేరు
పక్షివాహన! భక్త ♦ పక్ష! రామ!
గీ॥ యనుచు బిలువుము రాముని ♦ నరిన మనసు
నిన్ను విడనాడి యితరుల ♦ నెన్నబోవు... 29

సీ॥ పరదారధనముల ♦ పై బుద్ధినిలుపుట
పరులకెగ్గొనరింప ♦ పాలుపడుట
కొంచెమైననుసరే ♦ లంచంబుగై కొంట
మంచివారలపొందు ♦ మానుకొంట
యార్తజనులజూచి ♦ యాదరించకయుంట
తోగుబోతులచెంత ♦ దగిలియుంట
తగవిట్టిపనులని ♦ తరుచుగా జెప్పిన
యానానటంచు దా ♦ ననుటెగాని
గీ॥ క్రియకునిలువకుమది తన ♦ క్రియనుమాని
యేమిచెప్పేదు రఘురామ ♦ యేమనందు...30

సీ॥ కోతి యెటులదాటె ♦ గొంకకసంద్రంబు
మనరామచంద్రుని ♦ మహిమగాక

గొండ లెట్లునిలిచె ♦ బెండ్లకై వడి నీట
మన రామచంద్రుని ♦ మహిమగాక
రావణాసురుడెట్లు ♦ రణమందుబడిపోయె
మనరామచంద్రుని ♦ మహిమగాక
సీతయెటుల యగ్ని ♦ వాత దా బడిలేచె?
మనరామచంద్రుని ♦ మహిమగాక
గీ॥ వానిమహిమలు డెందమా! ♦ వశమె తెలుప!
యనుచు రామునిగొనియాడ ♦ మనగవినదు...

సీ॥ వ్రతములనొనరించి ♦ క్రతువులుగావించి
సతులనుబోషించి ♦ సుతులబెంచి
బాటలేర్పరపించి ♦ తోటలునాటించి
వడుగులు, పెండ్లిండ్లు ♦ కడునొనర్చి
కుడువ కట్టగనిచ్చి ♦ బడసిన ఫలమెల్ల
మహిమీదజననంబు ♦ మరలనొసగు
దాన మానసనీకు ♦ దగుల దించుకసుఖం
బాత్మరాముని జేర ♦ నబ్బుసుఖము
గీ॥ ఎన్నివిధములనైనను ♦ నెన్నడైన
వెన్ను నెడబాయుబోకన ♦ వేడ్కపడదు...32

సీ॥ రామచంద్రుని దయా ♦ రసమెట్టిదోదాని
మనస నీకెరిగింతు ♦ మఱవబోకు
పతిశాపమునహల్య ♦ పాషాణమైయున్న
గనిదాని బ్రతికించి ♦ గలిపెపతిని

అన్నకు భయమంది • యలమటించెడివాని
నధిపుగా కిష్కింధ • కతఁడొనర్చె
పగవానితమ్ముని • వగమాన్పిరక్షించె
సురకోట్లకమృతంబు • కరుణనిచ్చె
గీ• శబరిపండ్లియము క్తికి • జనగఁజేసె
నట్టి సదయుని సేవింపు • మనినవినదు ...33

సీ॥ నారాయణునిదివ్య • నామంబునుడువవే
నవ్యతానందంబు • నందగలవు
పరమేశు నేవేళ • బాడుచునుండవే
పాపంబు లెల్లను • బాసిపోను
గోవిందు నేవేళ • గొలుచుచునుండవే
గొప్పయాపదలెల్ల • దప్పిచనును
మూడుదారులమధ్య • ముఖ్యదారినిబట్టి
ముదమున శ్రీరాము • మొనసిగనుము
గీ॥ అట్టితరినీకు గలిగెడి • దెట్టిసుఖమొ
మనస చవిచూడుమనిన నా • మాటవినదు...

సీ॥ రాగంబుచేతను • రావణాసురుడును
కామంబుచే నరక • కాసురుండు
నధికలోభముచేగ • ధార్తరాష్ట్రుండు
మడసిరనెడిమాట • మహినినిలిచె
డెందమా! నీవునా • చందంబుగాబోక
శ్రీరమారమణుని • సేవజేయు

మీాప్సితంబులనిచ్చి • యిడుముల బోద్రోలి
యనుకంపతోడనిన్నాదరించు
గీ॥ మొప్పెతనమేల నొప్పగా • జెప్ప దేను
వినియు సుఖమొందుమాయన•వినదుమనసు. 35

సీ॥ వేయిమోములవాడు • వేయిగన్నులవాడు
వెలితిప్పవాసుండు • వేల్పుపెద్ద
లేపుణ్యపురుషుని • యెరుగంగజాలరో
యా రమారమణు నీ • వాశ్రయించు
కాలమంతయు వృథా • గానీయకిది మంచి
ఘనమైన సమయంబు • గానవినుమ
శ్రీరామ! శ్రీరామ! • శ్రీరామయంచు నీ
వేమారువినుతించు • వేదవేద్యు
గీ॥ ననుచు, హృదయంబునాట నే • న నెడునుడులు
వినియు తుణమైన మనసు ని•న్వేడదాయె...36

సీ॥ భువనభర్తవునీవు • పోషించకుండిన
కర్తయెవరున • న్గాచువారు
భువనమోహనమైన • తవ రూపమునుజూపి
యానంద మెవరు నా • కలవరింతురు
భవదీయకరుణ నా • పైని రాకుండిన
భవభయంబెటుల న • న్బాసిచనును
భవదీయకృపకు న • న్బాత్రునిగా జేయ
సమకట్టకున్న నా • సహజమైన

గీ॥ కుటిలతెటుఁ నిన్ను గొమరొప్ప • గొలువనిచ్చు
ననుచునీతోడ ననుమన్న • ననదుమనసు...37

సీ॥ మత్తమాతంగంబు • మడువులోవిహరించ
గని, నక్రిమద్దాని • కాలుబట్ట
కలసిపోరగలేక • కడుడస్సి దుఃఖించి
కలవా! లేవో! గదే • కలిగియున్న
రక్షించుమానన్ను • రక్షకుల్వేరుగా
లేరు నాకెంద్రైన • లేరు లేరు
అనెడి దీనాలాప • మాలించి చనుదెంచి
కరిని గాపాడిన • ఘనునినీవు
గీ॥ కరుణతోడుత మరువక • గావుమనుమి
యనినవినదాయె నయ్యయో • యలతిమనసు.38

సీ॥ నీదయారసమింత • నిజముగాసోకిన
మదియేలకదలుట • మానుకొనదు
నీకృపరానిచో • నేనెంతవేడిన
కాయకష్టమెకాని • కలదెఫలము
నీవెంతదనుక న • న్నేలుకొదలచవో
యందాక మదియేమొ • చిందులాడు
నీముద్దునగుమోము • నేవేళజూడంగ
గోరుచునున్నాడ • గోమలాంగ
గీ॥ కోర్కెదీర్చంగ నీవుగా • కొరులుగలరె
నాదుమది చెడుగాయెపో • మందలించి... 39

సీ॥ శ్రీనాథ! భూనాథ! ♦ సేవకజననాథ!
రాధామనోనాథ! ♦ రంగనాథ!
మానుల హృదయాబ్జ ♦ మధుపమా! ననుగావు
దీనజనోద్ధార ♦ దిక్కునీవు
పవనజ హృత్కంజ ♦ బంభరమా! నాదు
చిత్తాబ్జమందున ♦ జేరివేగ
బొడచూపవేల నా ♦ గడుకోర్కెదీరంగ
మనసుతో నీకేల ♦ మాటలనుచు
గీ॥ నీవు నాకండ్లయెదుటను ♦ నిలచితేని
చూడవే స్వామిననియెద ♦ జూడదేని... 40

సీ॥ కరిజేయుమొఱవిని ♦ త్వరగరక్షించిన
సరసిజాక్షుని నీవు ♦ స్మరణచేయు
అలనాడు ద్రౌపది ♦ యాపదన్బాపిన
శ్రీపతి నీకును ♦ ప్రాపువినుము
కాకాసురునితప్పు ♦ గాచి కాపాడిన
శ్రీకాంతునేవేళ ♦ జేరగోరు
రామచంద్రుడెనీకు ♦ రక్షకుండగుగాని
కాపాడ వేరొండు ♦ ఘనుడులేడు
గీ॥ వానిపదములబడి లేవ ♦ వలదటనిన
మనసు, వినివేడ్కపడదాయె ♦ మా,సమేత..41

సీ॥ భువనమోహనరామ! ♦ పూజితగుణధామ!
భువనరక్షకనామ! ♦ భవవిరామ!

భక్తపాలకరామ! ♦ భవరోగహరరామ!
భండనజయరామ! ♦ పరశురామ
భూసుతపతిరామ! ♦ బుధజననుతరామ!
భువనవందితరామ! ♦ పూజ్యనామ!
నారదనుతరామ! ♦ నాగారిహరరామ!
నాకేశనుతరామ! ♦ యఘువిరామ!
గీ॥ యనుచు ననిశంబు భజియింపు ♦ మనిన మనసు
నిలిచి వినదాయె నేలనో ♦ నీరజాక్ష!... 42

సీ॥ నవ్వులుగావు నీ ♦ కవ్వలగతి లేదు
పువ్వులవిలుకాని ♦ యవ్వమగని
నవ్వేమొగంబు నీ ♦ కెవ్విధిగననగు
నవ్విధి నవ్వేల్పు ♦ నరయుమింక
మున్న నేకులు వాని ♦ సన్నుతించియె ముక్తి
కెన్నను గాంచిరి ♦ దివ్యముగను
మనస నీకిదిమంచి ♦ మార్గంబు హరిజేర
చలనంబువిడు వాని ♦ గలయగలవు
గీ॥ అనుచు మృదువుగా జెప్పిన ♦ నాలకించ
దేమిసేయుదు నోదేవ ♦ దేవరాయ... 43

సీ॥ అవనీతలంబున ♦ నవనీతచోరుని
మునిగణంబులుగొల్చి ♦ ముక్తులైరి
శ్రీరమానాధుని ♦ సేవించి, రావణు
ననుజుండు లంకకు ♦ నధిపుడాయె

భక్తులందున మేలు • బంతియనంగనా
ప్రహ్లాదుడలరె శ్రీ • పతినిదలచి
యిట్టుల ననేకులా • యిందీవరశ్యాము
నచ్చభక్తిచే • జొచ్చినారు
గీ॥ మనస నీవును శ్రీహరి • మఱుగు జేరు
మనగ వినదాయె నయ్యయో •మధువిరోధి..44

సీ॥ మనస చెప్పెదనీకు • మరివానిగుర్తులు
కని వానిపాదము • లలయబట్టు
మార్తాండసమ తేజ • మణికిరీటధరుండు
మందస్మితుడు వన • మాలయుతుడు
పాపరేడేతన • పాన్పుగాగలవాడు
పాదాగ్రమున గంగ • బరగువాడు
యురమున శ్రీదేవి మెరయ గన్పడువాడు
శ్రీవత్సమనుచిహ్న • జెలగువాడు
గీ॥ చూడు మాతని తనుకాంతి • జూడుచూడు
మంత్రినేగాని యదితన • కంటగనదు... 45

సీ॥ వైకుంఠనిలయ నా • వాంఛదీరేటట్టు
నీసుందరాకృతి • నేడుచూపు
ముదముతో నీపాద • ముల బూజజేసెద
హృదయాబ్జముననిల్చి • వదలకెపుడు
ఇదియ నావాంఛిత • మిది నీవెరుంగవే ?
పదివేసములసామి • పలుకవేమి

యాశ్రయించినవాని ♦ నాదరించుట నీకు
బిరుదనినమ్మి నే ♦ బిలిచినాడ
గీ॥ వినియు, రావేల ? నామనం ♦ బిడువకుండ
నిన్ను ననిశంబు, గొలువంగ ♦ నిలువదాయె॥ 46

సీ॥ తనువు నిత్యంబని ♦ తలపరాదనియంటి
భోగంబులెల్లను ♦ బొంకటంటి
వయసు నిలువదంటి ♦ వన్నెలు నిలవంటి
బింకంబు చెడునంటి ♦ బొంకికంటి
పరదారధనముల ♦ పైనాశ విడుమంటి
పరనింద వాక్యంబు ♦ పలుకకంటి
నినుసేవ బొగడుట ♦ నీచంబటంటిని
కలకాలమీరీతి ♦ గదలకంటి
గీ॥ దశరథాత్మజు పలుమారు ♦ దలప్రుమంటి
నైన మదియేమొ నామాట ♦ నమ్మవినదు॥ 47

సీ॥ వెలుగులకెల్లను ♦ వెలుగుగానున్నట్టి
వేదాంత వేద్యుడ ♦ వీవెకావె ?
లోకంబులోకసారి ♦ లోనంచుకొనుటకు
వెలిదీసి వానిని ♦ యెలమిగావ
సాక్షివై యుంటకు ♦ సమయించుటకుగూడ
నీవెగాకర్తవు ♦ నిగమవినుత
నను వేరుగాజేయ ♦ న్యాయమా నళినాక్ష !
కని పెంచినాడవు ♦ కావె ? నీవు

గీ॥ నాదుమనసు మంచినడక ♦ ననుగమింప
తీర్చి దిద్దుమటంటినో ♦ దీనబంధు... 48

సీ॥ దంపతీయుక్తులై ♦ దలచిరి యెవ్వాని
శివుడు పార్వతియును ♦ చిత్తమలర
భక్తబృందంబెల్ల ♦ భజయించుతు రెవ్వాని
మందిరముల మనో ♦ మందిరముల
దంతియు ద్రౌపది ♦ ధ్యాపించిరెవ్వాని
ప్రాణమానముల గా ♦ పాడుమంచు
వారివారికి మనో ♦ వాంఛలుదీరంగ
వరదుడై యెవ్వాడు ♦ వారిబ్రోచె
గీ॥ నతడె శ్రీరాముడనగను ♦ నవతరించె
విడువకాతని మనసన ♦ వినవెవిసదు... 49

సీ॥ సీతాపతీ! నీదు ♦ చిత్తంబునకుదోచు
వడువున గానిమ్ము ♦ నుకువనేల
నేనెంత మొఱగిన ♦ నీకేమొ దయరాదు
కరిరాజు నేరీతి ♦ గాచినావో!
బ్రతిమాలుకొనినను ♦ పలుకవై తివి నీవు
వినబడదా? యేమి ♦ విశ్వరూప
మనసు నాకనుకూల ♦ మై నటించుటలేదు
మరియు నీవైన నా ♦ మనవి వినవు
గీ॥ ఇంకనెవ్వని బిలుతునే ♦ నింక నెవని
వంకకేగుదురామ నా ♦ జంకుమాన్ప... 50

సీ॥ నామనంబేవేళ ♦ నమ్మి నిన్గొలువంగ
నేరకున్నదిగాన ♦ నెట్టులైన
కోపించియైనను ♦ కొట్టి తిట్టయినను
నేర్పుతోనైనను ♦ నెట్టులైన
దానికా చెడుబుద్ధి ♦ దాపరించగనీక
నీపాదసేవకై ♦ నిలిపితేని
దానిపై నాకున్న ♦ దరిలేని కోపంబు
దీరు నావెతలెల్ల ♦ దీరునయ్య
గీ॥ రామ శ్రీరామ రామ శ్రీ ♦ రామయంచు
కరములనుజాచి నేనిన్ను ♦ శరణటందు... 51

సీ॥ శ్రీరామచంద్రుని ♦ సేవింపుమేవేళ
నారమానాథుండు ♦ నతిదయాబ్ధి
పాటలువానిపై ♦ బాడుచునుండుము
మాటలలోనైన ♦ మఱవబోకు
బాట నొంటిగనడ ♦ బాఱిప్రింౘునప్పుడైన
మాధవాచ్యుతయంచు ♦ మరియునను ము
అనుమానమిక మాని ♦ యనిశంబు గొనియాడి
గనగోరువాని ద ♦ ర్శనము నీవు
గీ॥ అనుచు మదికేను జెప్పిన ♦ యానటనదు
దాని చెడుగుణంబిట్లుండె ♦ దాసవరద...52

సీ॥ రాముడే గతిగాని ♦ రఘుకులమ్మరి వేరు
లేరులేరిక మఱి ♦ లేరులేరు

పాపంబులను భస్మ ♦ పటలంబుగను జేసి
పావనంబొనరింప ♦ ప్రభువతండె
విద్యనుగలిపించి ♦ యుద్యోగమిప్పించి
ఘనకీర్తి దెప్పించు ♦ ఘనుడతండె
యందలంబెక్కింప ♦ నధిపునిగా జేయు
భక్తిగలుగజేయ ♦ ముక్తినీయ
గీ॥ రాముడేగాని మరిలేరు ♦ రక్షకులని
నమ్మజెప్పిన నామది ♦ మిమ్మెగనదు... 53

సీ॥ వైజయంత్యనుమాల ♦ వక్షంబుపైగ్రాల
మణిభూషణంబులు ♦ మఱియువెలుగ
వైనతేయుని నెక్కి ♦ వరలక్ష్మితోడను
దర్శనమిమ్మని ♦ తగనుతించు
కనులార నినుజూడ ♦ గాంక్షతోనున్నాడ
విడనాడతగదని ♦ వేడుకొనుము
కనులకానందమౌ ♦ తనుకాంతిగనజేసి
వరమిచ్చువరకును ♦ వదలబోకు
గీ॥ మనుచు నాడెందమునకేను ♦ మఱియుమఱియు
జెప్పుచుంటికాని తానది యొప్పుకొనదు... 54

సీ॥ శంకరనుత! నాదు ♦ వంకజూడవదేమి
కొంకక నన్నేలు ♦ కొనవదేమి
మాధవ! నీదయ ♦ మరచియుంటివదేమి
మాపాలగలిగుంట ♦ మానితేమి

కౌశికమఖరక్ష! ♦ కౌస్తుభమణివక్ష!
కౌంతేయసతిరక్ష! ♦ కలుషశిక్ష!
నవనీతదధిచోర! ♦ నవమోహనాకార!
నవరత్నమయహార! ♦ నమ్మినార
గీ॥ మనసు నినుజూడ సంభ్రమ ♦ మంద లేక
మసలుచున్నది యిటునటు ♦ మసలుటుడిపి 55

సీ॥ కొండంతకోరిక ♦ గోరి వేయిమ్మంచు
కోరగాలేదయా ♦ కోమలాంగ!
ధన ధాన్యరాసుల ♦ దండిగానిమ్మంచు
ధ్యానించలేదయా ♦ దానవారి!
చతురంగబలముల ♦ చాలనాకిమ్మంచు
రంధిచేయగలేదు ♦ రామచంద్ర!
నామసంబెడపక ♦ ననుబాసి చనుచుండ
నాత్తరక్షకదాని ♦ నాపుమంటి
గీ॥ నిదిమె నాకోర్కెగనుకనో ♦ యిందిరేశ!
యవధరించియు నామాట ♦ లందు పైని... 56

సీ॥ ఎంతజెప్పినసీకు ♦ సుంతైన తెలియదా
వాసనత్రియముల ♦ వదలలేవ
యభిమానగ్రిహము ని ♦ న్నణచివేయునుగాన
నినుజేరనీకుండ ♦ నెట్టలేవ
నీదుసామర్ధ్యంబు ♦ నీవెరుంగగలేక
నేలచెడెదవిట్లు ♦ జేలవగుచు

నీవొక్క నిముషంబు ♦ నిలిచి తారకయోగ
సారామృతముయొక్క ♦ చవినిగొనుము
గీ॥ దివ్యతేజంబుగనినీవు ♦ తేజరిలెదు
వినవెమనసని చెప్పిన ♦ వినదదేమొ... 57

సీ॥ నామనంబొకవేళ ♦ నాగారివాహా! నీ
చరణముల్సేవింప ♦ జాలదేని
నామనంబొకవేళ ♦ నవనీతచోర! ని
న్నూజించగాఁ దాను ♦ బూనదేని
నామనంబొకవేళ ♦ నరహరిరూప! నీ
నామసుధనొకింత ♦ నంజదేని
నామనంబొకవేళ ♦ నారదవందిత!
నినుభావించనకుండ ♦ నిలువదేని
గీ॥ దర్శనంబిచ్చి దానినీ ♦ దరినిజేర్చి
నిన్ను బూజించగాబుద్ధి ♦ నెటినొసంగి... 58

సీ॥ మనస! నీవిటుఁ పైని ♦ మానాథుడైనట్టి
వనమాలధరుని నీ ♦ వనవరతము
విడువనిభక్తితో ♦ నెడలేక సేవించు
తడవు సేయక నీదు ♦ దుడుకుమాని
నారాయణా! హరీ! ♦ నారసింహా! ముకుంద!
నలినాప్తకులజాత! ♦ నలిననేత్ర!
దీనార్తిహారణ! నా ♦ దిక్కునీవేయని
వినయపూర్వకమైన ♦ విన్నపంబు

గీ॥ జేయవేరామునకునీవు • జిడ్డుబాసి
యంచు లలితంబుగానంటి • నైనవినదు... 59

సీ॥ నీవేమొనామాట • నించుకైననుగాని
విశ్వసించుటలేదు • వెనుకనీవు
యమకింకరులచేతి • గుముకులువడలేక
శ్రమనొందునప్పుడైన • జాలిబడవె
నీచజన్మములెత్తి • నీచకర్మలజేసి
నెగులొందునప్పుడైన • నెరుగబడదె?
మనస! నీచెయివులు • మహినన్ను బాధించె
నందుచేనీకునే • నయముభయము
గీ॥ చూపిచెప్పితి గాకున్న • జోలిమాలి
యుండలేనటేయసిన నా • నుడులువినదు 60

సీ॥ నిలిచితేనాకేమి • నిలకున్ననాకేమి
పడరానియిడుమల • బడియెదీవు
తెలిసినంతవరకు • తెలియనివారికి
దెలియజేయుటధర్మ • తెరువుగాన
నేనెరింగినయంత • నీకెరిగించెద
లోకంబులోనింద • నాకదేల
నిలిచి నీలోనీవె • నీలవర్ణునిగాంచి
తులలేనియానంద • మొలమినొందు
గీ॥ నీవు, నీమేలుదెలియంగ • నేరవేని
మనస! నీకర్మమని జోలి • మానితయ్య...61

సీ॥ పలుమారునిన్ను నే • బ్రతిమాలుకొనుచున్న
పైపైకిబోనేల • భ్రష్టమనస!
లాలించుచున్నను • తూలుచునున్నావు
పాలుమాలినబుద్ధి • చాలుజాలు
నీకైనపౌడమదు • నేచెప్పవినబడ
దేమొనీకర్మ మ • దెట్టులగునొ
బుజ్జగించినగాని • బుద్ధిరాదాయె నీ
మొద్దుతనంబది • మొద్దుగాను
గీ॥ ముద్దుముద్దుగ నానుడు • లొ్కొద్దివినియు
పద్మనాభునిగనుమన • భాగ్యమనదు... 62

సీ॥ మరిమరివేడిన • మాటాడకుండుట
మర్యాదలోపంబు • మానిపాల!
బ్రతిమాలుకొలదిని • బలుకకయుండుట
పాడిగాదదినీకు • భక్తపాల?
ఓహెూకృష్ణాయన్న • నోయటంచనవేమి
కోపమానామీద • గోపబాల!
నామనంబేవేళ • నటునిటుచనుచుండ
నినువలగొనుమంచు • నేను తనకు
గీ॥ పీలుపడినంతవరకును • వివరముగను
జెప్పి వేసటనొందితి • చిత్తజనక... 63

సీ॥ మత్స్యమైజలరాసి • మధ్యజొచ్చుటయును
కుధరంబునెత్తంగ • కూర్మమగుట

యాదివరాహమై ♦ యవని నెత్తుటయును
దితిసుతు మృతుజేసి ♦ తిరుగుటయును
వటుడవై బలిదైత్యు ♦ నటమటించుటయును
పృథ్వీశులనుజంపి ♦ ప్రీతిపడుట
శ్రీరామమూర్తివై ♦ క్షితినిపాలించుట
యసురాళిననిద్రుంచి ♦ యలరుటయును
గీ॥ గొప్పగాదయ్య నామది ♦ కుప్పిగంతు
లేయుచున్నది నీశక్తి ♦ నెరపిమైన... 64

సీ॥ ఎవ్వడుప్లవగుల ♦ నివ్వటిలగగూర్చి
తరులచే గిరులచే ♦ త్వరితముగను
కట్టగట్టగజేసి ♦ కడలిమధ్యమునందు
బాటనేర్పరపించె ♦ భవ్యముగను
వనచర గములను ♦ వరుసగానడిపించి
లంకముట్టడివేసె ♦ శంకలేక
నరితమున్మడెనట్టి ♦ యావిభీషణునకు
భయమెడలించి రా ♦ వణునిదునిమె
గీ॥ నట్టి జగజెట్టి, కౌసల్య ♦ పట్టి రాము
మనస! సేవింపుమనినను ♦ మంచిదనదు... 65

సీ॥ కఫవాత పైత్యము ♦ లప్పుకున్నప్పుడే
కళ్యాణరాముని ♦ గనవె మనస!
యమకింకరులువచ్చి ♦ యలముకొనకమున్నె
కమలనాభునిభక్తి ♦ గలిగియుండు

మినజుభటులునిన్ను ♦ నీడ్చుకపోలేరు
దవ్వుదవ్వులనుండుచు ♦ దరికిరారు
రామనామామృత ♦ రసమానుటయెనీకు
రక్షకంబనిగను ♦ తక్షణంబు
గీ॥ నిన్ను గాపాడునతడన ♦ నెలమితోడ
నిలిచివినదాయె మదికి నే ♦ నేమనందు... 66

సీ॥ పాలవారాశిలో ♦ పల బాముపై యోగ
నిద్రిలోనున్నట్టి ♦ నీరజాక్షు
కేలవేణువుబూని ♦ మేలుగాబూరించి
వ్రేతలభ్రమయించు ♦ వేదవేద్యు
నేలసేవించవ ♦ దేలనేజాలంబు
చాలుచాలికమాను ♦ చండితనము
దయచాలగలవాడు ♦ ధరిజేర్చునిన్నిక
మరువకునామాట ♦ మనస! యనిన
గీ॥ ముచ్చటకునైన శ్రీరామ! ♦ ముద్దుకృష్ణ!
యనగబూనదో యఖిలేశ! ♦ యఘవినాశ! 67

సీ॥ ఏలనేమనస నీ ♦ కేలనేయీజాల
మేలనేయికచాలు ♦ చాలునీకు
యేలనే యీమాయ ♦ జాలంబులోజిక్కి
తేలకుండుటదేల ♦ తెలివిమాలి
యేలనేవిషయవాం ♦ ఛాలోలవై నీవు
కాలుగాలినపిల్లి ♦ లీలదిరుగ

నేలనీకింతగా • నేజెప్పరానేల
మేలెఱుంగకయున్న • బేలనీకు
గీ॥ పాలుమాలికనీకేల • పలువమనస!
నిలిచి ధ్యానించు హరినన • నిలువదామె 68

సీ॥ విలువిద్యలోఁచాల • విఖ్యాతిగాంచిన
వీరులలోమేటి • వీరుడవును
చాణూర ముష్టికు • ల్బలమునన్పైరాఁగ
మట్టి మల్లాడిన • జెట్టివియును
నరిసమూహము ద్వార • కనుముట్టడించంగ
బరిమార్చినటువంటి • బల్లిదుడవు
కాళీయఫణినిన్ను • గరచి పైఁజుట్టిన
కాళ్లచేఁద్రొక్కిన • ఘనుఁడవీవు
గీ॥ నాదుమనమును నీవిక • నాపలేవె
దోచుచున్నది వింతగా • దోషహరణ... 69

సీ॥ గణుతింపగాలేరు • కమలభవాదులు
నీగుణజాలము • ల్నేర్పుతోడ
ధ్యానించగాలేరు • ధన్యతాపసులు
నెలమి మానసముల • నిలిపియైన
వర్ణించగాలేరు • వరకవీంద్రులునీదు
కమనీయగాత్రశో • కంబుకలిమి
నెట్టివారికినైన • నిట్టివాడనినీదు
గుట్టుతెలియగరాద • దెట్టులైన

గీ॥ నేయుపాయంబొ నినుజేర • నెరుగగలనె!
యైన నామది కచలత • నల వరించి... 70

సీ॥ లోకవాంఛలకెల్ల • లోనుగానైతివా
కడతేరుమార్గంబు • గానలేవు
వీనులున్నందుకు • విశ్వేశు చరితంబు
వినకున్న నవిగోడ • వివరములగు
జీవకోట్లకునెల్ల • సేవించుటకు చోటు
శ్రీరాము చరణమే • చెలగి వినుమ
విపరీత బుద్ధులు • విడచి నీవిట్టుపైని
విశ్వరక్షకుడైన • విమలచరితు
గీ॥ పాదపద్మముల్బట్టుమా • భక్తితోడ
ననిన వినదాయె నామది • హరిముకుంద...71

సీ॥ వేదంబు లెవ్వాని • వివరింపజాలక
విసిగివేసరి నాల్గు • విధములయ్యె
భుజగేంద్రుడే దేవు • బొగడంగనేరక
నాలుకల్వేలుగా • నతడు వొందె
దివిజేంద్రుడే దేవు • దిలకించనేరక
నయనముల్వేయింటి • నతడు వొందె
సద్గురుకృపలేక • సర్వేశు నీక్షింప
సాధ్యమేరికిగాదు • సత్యమిదియు
గీ॥ మనస ! శ్రీరాము గనగురు • మరుగుజేరు
మనిన హర్షంబునొందదు • మానిపాల...72

సీ॥ గానలోలుని నీవు • గానంగ దలచితే
కదలక నిలువెుక్క • ఘడియసేపు
దీనజనోద్ధారు • తిలకించ దలచితే
కదలక నిలువెుక్క • ఘడియసేపు
సూనశరునిగన్న • సుందరాంగుని జూడ
గలదేని కోరిక • ఘడియ నిలువు
భానువంశజు రాము • బరికించబూనితే
కదలక నిలువెుక్క • ఘడియసేపు
గీ॥ మీన మేషంబు లికలెక్క • మాని మనస!
వాని శరణాంబుమనీన దా• వల్లెయనదు...73

సీ॥ ఆపన్నులను గావ • నతివేగ బరుగెత్త
నెక్కెనా నండజం • బెక్కె నతడు
దీనులరక్షింప • దీక్షవహించెనా
పాలవారధియందు • బండెనతడు
భక్తులపాపము • ల్బరిహరించుటకునై
బట్టెనా జక్రింబు • బట్టెనతడు
భక్తులబాధించు • బడవాల నణగింప
బట్టెనా విల్లమ్ము • బట్టెనతడు
గీ॥ ఇటుల వెలుగొందువాని నీ • వెట్టులనైన
మనస దరిజేరి సేవించు • మనిన వినదు... 74

సీ॥ దారాసుతాదులు • ధనధాన్యరాసులు
పతమని నమ్మకే • చపలు మనస

దాస దాసీలును • దంతావళంబులు
సతమని నమ్మకే • చపల మనస
దాయాదులును మంచి • తగిన గేహంబులు
సతమని నమ్మకే • చపల మనస
దాశరథీయంచు • దయబుట్ట బ్రార్థించు
సతతంబు రాముని • చపల మనస
గీ॥ చెడకు లోకంబులోబడి • చెనటి మనస
యనిన తెలివొంది ప్రార్థింతు•నటు లెయనదు. 75

సీ॥ శ్రీరామ శ్రీరామ • శ్రీరామ యంచును
శ్రీరమారమణుడై • చెలగువాని
గోవింద గోవింద • గోవింద యంచును
కోవిదవంద్యుడౌ • గోపబాలు
మాధవ మాధవ • మాధవా యంచును
మధుసూదనుండైన • మదనజనకు
పద్మాక్ష పద్మాక్ష • పద్మాక్షయంచును
పద్మగర్భునిగన్న • పద్మనాభు
గీ॥ గనగదలచితె మనస నీ • కడలుటుడిగి
స్మరణ గావింపుమనినను • పరగ వినదు... 76

సీ॥ జన్మమెత్తినదాది • జగతిలో నెన్నాళ్లు
జీవించగలమొకో • జెప్పలేము
సిరిసంపదలతోడ • చెలగుచుండుదమన్న
కలకాలమొకరీతి • గలుగబోవు

తనుబలకాంతులే ♦ తథ్యంబటందుమా
ముదిమి రావేగమే ♦ వదలిపోవు
జాలంబుచేసిన ♦ కాలంబు వృథయౌను
వీలుగా దలువై ని ♦ కాలుఁగెలువ
గీ॥ మేలుగోరినదానవై ♦ కూళ మనస !
గోలుఁవవేరాము ననినను ♦ గోల్తు ననదు...77

సీ॥ ఏమిచెప్పుదు నీకు ♦ స్వామియౌ రాముని
కారుణ్యరసమును ♦ ఘన యశమును
నేమిచెప్పుదు నీకు ♦ స్వామియౌ రాముని
యౌదార్యమును మహా ♦ యాదరమును
నేమిచెప్పుదు నీకు ♦ స్వామియౌ రాముని
సద్గుణసమితిని ♦ సరసతయును
నేమిచెప్పుదు నీకు ♦ స్వామియౌ రాముని
భక్తవత్సలతయు ♦ బాహుబలము
గీ॥ డెందమా! నీవు రాముని ♦ చందమరసి
చెందవేహోయి సన్నవిని ♦ చెందెదనదు... 78

సీ॥ యుగచతుష్టయమందు ♦ నూహించిచూడంగ
కలియుగధర్మంబు ♦ గాదె ఘనము
ఘడియలేడేచాలు ♦ కదలక నీవున్న
కైవల్యపదమును ♦ గాంచుటకును
తక్కినయుగముల ♦ నెక్కువ కాలంబు
తప్పక నిలవలె ♦ తథ్యమిదియు

మేలెంతచేసెను ♦ మేధావియావిధి!
మేలుకో యిప్పుడైన ♦ మేలునొంద!
గీ॥ నిలిచినంతనె గందువు ♦ నీలవర్ణు
మనస! నేనొందుదలచకు♦ మనినవినదు...79

సీ॥ తాటకిగుండెలో ♦ దూటానర్చుటయందు
విశ్వనాథునివిల్లు ♦ విఱుచుటందు
ఖరదూషణాదుల ♦ ఖండించు పనియందు
కాకాసురుని కన్ను ♦ గాల్చుటందు
వాలి నొక్కమ్మున ♦ గూలనేయుటయందు
రావణు ననిలోన ♦ రాల్చుటందు
జేజేలు దివినుండి ♦ జేజేయనందగు
జగదేకవీరుడౌ ♦ జానకీశు
గీ॥ విజయమెరిగియు మనస నీ ♦ వింకనైన
భజనగావించు మనవిని ♦ భాగ్యమనదు...80

సీ॥ వింతగానుండె నీ ♦ విటుల రాకుండుట
వివిధభక్తులనేలి ♦ విసిగినావా!
వయసుమించుటచేత ♦ వడివడి నడలేవా!
బహు వ్యాపకముచేత ♦ బడలినావా!
యాంతరంగిక భక్త ♦ స్వాంతంబులంజిక్కి
రాలేకయుంటివో ♦ రామచంద్ర!
రాకతీరదు నేను ♦ రక్షించుటకునాదు
భారంబునీపైని ♦ బడగవైచి

గీ॥ ఎదురుజూచుచు నేనుంటి • సదయుడవయి
నాదుడెందాన సరిచేసి • యాదుకొనగ... 81

సీ॥ వాసుదేవ ముకుంద • వారివాహశ్యామ
వాణీశనుతనామ • వసుధధామ
గోవింద మాధవా • గోపాల శ్రీహరీ
గోవర్ధనోద్ధార • గోపబాల
కాంచనాంబరధరా • కలుషాంతకాహరీ
కామితఫలదాయి • కడలిశాయి
దేవదేవుడవీవు • దేవేంద్రనుత బ్రోవు
మరువక ననుగావ • మంచిదొరవు

గీ॥ ననుచు నుతియించుమంటినా • యలతి మదిని
గాని తానట్లుచేయంగ • గడగకుండె!... 82

సీ॥ మాధవా యనరాద • మధువైరియనరాద
మాంపాహి యనరాద • మంకు మనస
పరమాత్మ యనరాద • పరమేశ యనరాద
పాలించుమనరాద • పాడుమనస
శ్రీనుత యనరాద • శ్రీనాధ యనరాద
శ్రీయుత యనరాద • చెనటి మనస
దైత్యారి యనరాద • దైవమా యనరాద
తాళలే యనరాద • కూళమనస

గీ॥ ఎటుల దరిజేర నేర్తువు • కుటిల మనస ?
రాముస్మరియించ రమ్మన • రాదువినదు...83

సీ॥ కరిని ప్రహ్లాదుని • కౌంతేయులను మహా
కష్టదారిద్ర్యము • గల కుచేలు
నేలినావని విని • చాల నేమదినమ్మి
పాలాక్షువినుత నీ • పాల బడితి
నేలీల నేలెదో • యెరుగజాలను తండ్రి
జాలమైనను నేను • తాళజాల
కాలమంతయు వృ • థాగా బోవుచున్నది
కడతేరు మార్గంబు • గానరాదు
గీ॥ భారమికనీదె ననుబ్రోవ • భవ్యచరిత !
యంచు నగుమన్న ననదాయె • నాదుమనసు. 84

సీ॥ రామచంద్రునిముద్దు • మోము జూచుటకంటె
హెచ్చైన పనినీక • దేదొ చెప్పుమ ?
కరుణాసముద్రుని గనుగొను పనికంటె
హెచ్చైన పనినీక • దేదొ చెప్పుమ ?
భరతాగ్రజునినామ • భజనజేయుటకంటె
హెచ్చైన పనినీక • దేదొ చెప్పుమ?
సీతాసమేతుని • సేవించు పనికంటె
హెచ్చైన పనినీక • దేదొ చెప్పుమ... 85
గీ॥ ఎందుకిక భ్రాంతి లోకంబు • నందు నీకు
మనస! శ్రీరామయనుమన • మంచిదనదు. 85

సీ॥ లేదు రామునిబోలు • లేనవ్వుమొగమెందు
నఖిలజగంబుల • నరసిచూడ !

లేదు రామునిబోలు • నెన్నయూ రూపంబు
భువనత్రయంబుల • బోల్చుటకును!
లేదు రామునియొక్క • నెన్నగు శాంతంబు
నెవ్వరియందైన • నెంచిచూడ!
లేదు రామునియందు • లేశమైననుగాని
కఠినత్వమనునది • గాన మనస!
గీ॥ పూజగావించు మతనికి • పూర్ణభక్తి
సలిన గావింతుననదు యో • యఘువిదూర.86

సీ॥ శ్రీరాముచరితంబు • జీవనాధారంబు
భవరోగనాశంబు • భ్రాంతిహరము
శ్రీరాముచరితంబు • చిత్తనిర్మలకారి
యాశ్రిత జనదుఃఖ • హారణమదియు
శ్రీరాముచరితంబు • క్షేమంబు జీవుల
కెల్ల వేళలయందు • నెంచిచూడ
శ్రీరాముచరితంబు • చెవులారవిని నీవు
నానందరసమగ్న • వౌదువేని
గీ॥ వెంటనేగందు వాతని • వినవె మనస!
యంటినేగాని శ్రీరామ! • యదియువినదు.87

సీ॥ గొప్ప యుద్యోగంబు • కొమరొప్పగల్గియు
గోసాధురక్షణ • గోరవైతి
వారోగ్యభాగ్యంబు • లలవడియును నీవు
రోగపీడితులకే • బాగుగనవు

భోగభాగ్యంబులు ? బాగుగాగల్గియు
బారుగుదారిద్రిల • బ్రోవవైతి
మానవతనువున • మసలుచున్నందుకు
నంచనైతివి బుద్ధి • మంచియందు
గీ॥ మనస! యికనైన మంచియా • మార్గమూని
రాము భజియించరమ్మన్న • రాదువినదు. 88

సీ॥ నీయిచ్ఛకతననే • నిఖిల ప్రపంచంబు
గలిగెననెడిమాట • కల్లయగునె ?
నీదయాదృష్టిచే • నిఖిల ప్రపంచంబు
పోషించబడుటది • బూటకంబె ?
నీనిస్పృహతచేత • నిఖిల ప్రపంచంబు
గనరాకపోవుట • కబ్బురంబె
గణుతింపగాలేని • ఘనకార్యముల్నైన
సమయోచితంబుగ • జరుపునీకు
గీ॥ తలచితే యెంతపనిమది • తలగకుండ
నిలుపజాలవే ? నేదాని • నిలుపలేను... 89

సీ॥ సూర్యవంశవరేణ్యు • చూడనేరనికండ్లు
కండ్లుగావవి గాజు • గుండ్లుగాని
కళ్యాణరాముని • కథలాలకించని
చెవులుగావని బొమ్మ • చెవులుగాని
చక్రధరుని పాద • జలజముల్గొలువని
మేనుగాదది పెద్ద • మానుగాని

గానలోలునిపాట • ఘడియైన గావింప
గాలేని నోరది • గాముఁనోరు
గీ॥ గాన స్వాంతము! శ్రీరాము • గనఁగ, వినఁగ,
గొలువ, గానంబులనుజేయ • వేన వినదు...90

సీ॥ శ్రీరమారమణ నీ • చిత్తంబునకు మెప్పు
కలుగంగ నడనేర్చు • గాననైతి
పతితపావనతకై • బట్టినాడవుగదా?
బిరుదు నీచేతను • బింకముగను
పాపినైనను నాదు • ప్రార్థన వినివేగ
నీదివ్యతేజంబు • నేఁడుచూపు
మనసు సంతసిలంగ • మమతలెల్ల దొలంగ
మనుపగోరితినయ్య • మఱచియయ్య
గీ॥ నాదుడెందంబు మీపాద • నలినమందు
నుండనేరకయున్నదో • యుదధిశయన!...91

సీ॥ పద్మబాంధవు వంశ • పావనుఁడగు రాము
పాదపద్మంబుల • నంటగోరు
పద్మగర్భునిగన్న • పతితపావనమూర్తి
పై బుద్ధినుంచవే • పదిలముగను
పద్మాలయనుగూడి • త్వరగ దర్శనమిచ్చి
పాలించు దయతోడ • పతితమనస
పద్మములను గేరు • పదయుగంబును బట్టి
వరమిచ్చువరకును • వదలఁబోకు

గీ॥ ముక్తిదాయకుడగు రామ • మూర్తియందు
భక్తిచే ముక్తిగనుమన • యుక్తమనదు...92

సీ॥ తగునయా? నీవునా • తప్పులెల్ల గణించి
తలగియుంటివి నాకు • దవ్వుగాను
దేహమున్నంతలో • దేవాదిదేవమీ
దివ్యతేజంబును • దేరిచూడ
గోరికతోనుంటి • గోపంబుచాలించి
కోమరొప్పజూపునీ • గొప్పరూపు
యింతకంటె హెచ్చు • యికనిన్ను గోరను
మరుగుననుండుట • మురువుగాదు

గీ॥ నాదుడెందంబు నీయందు • నమరదాయె
తప్పుకీవేళ దయగల • దాతవైతె...     93

సీ॥ కలలోన గనుపించి • కదలిపోవుటెగాని
నీనిజ తత్వంబు • నిలుపవైతి
ధర్మమా యిదినీకు • దశరథాత్మజరామ
కాలయాపనమేల • గదలిరావె
జంతుజాలములందు • వింతగా నీవున్న
మర్మమే నెరిగితి • మాన్యచరిత
గురు కృపారసముచే • గుర్తెరింగితినింక
దాగగానేల నో • ధన్యచరిత

గీ॥ యంచు ననుమన్న నామది • యించుకేమొ
విన్నవించంగ బూని తా • వెనుకదీసె...94

సీ॥ సాష్టాంగ మొనరింప • సాక్షాత్కరించును
సర్వేశ్వరుడునీకు • సత్యమిదియు
గళమునొవ్వగ వాని • గానంబొనర్చిన
యానందమునవిన్న • నాదరించు
నిలిచి ధ్యానమొనర్ప • నీచెంత నేయుండు
కదిలిపో నేరడు • గాన మనస
అభయమిచ్చును నీవు • నట్టిట్టు దిరుగక
నాతని చరణము • లూతగొనుము
గీ॥ భవములనుబాసి ముక్తిని • బడయగలవు
నమ్మ నామాటయనినను • నమ్మదామె. 95

సీ॥ భక్తులపాపము • ల్బాపంగ నేగదా
బట్టినాడు బిరుదు • భద్రిముగను
భక్తుల దారిద్ర్య • భంజనంబొనరింప
శ్రీదేవి నురమున • జేర్చినాడు
కావవేయనియన్న • కష్టజీవుల నెల్ల
కాపాడ తనకేమొ • కలదు బిరుదు
సమయంబు చెడకుండ • సాక్షాత్కరించనై
పక్కని జక్కగా • నెక్కినాడు
గీ॥ మొక్కు రాముని పదకంజ • ములకు మనస
యనుచు బ్రతిమాలిననుసరేయంచుననదు. 96

సీ॥ సీతాకళత్రుని • సేవగోరితివేని
వాసనత్రయముల • న్వదలవలయు

పరమాత్మునేవేళ • పరికించదలచితే
పంచమలంబుల • న్బారద్రోలు
మాత్మరాముని నీవు • నరయంగదలచితే
యష్టమదంబుల • వంటవలదు
"రంగరంగాయని • రవముజేయుటెగాని
లోపల హరిభక్తి • లోడలోడజెక్కె"
అనెడిరీతిని గాకుండ • నవగుణముల
విడిచి భజయించుమాయన్న•వినదుమనసు. 97
సీ॥ కంఠ్లైగ్రబారంగ • గంజాయి పొగబీల్చ
గననేర్తువాదాన • ఘనునిహరిని
మద్యపానముజేసి • మైమరచినాగాని
గననేర్తువాదాన • ఘనుని హరిని
సాధులగోష్ఠిలో • సమరసంబెరిగిన
గననేర్తువాదాన • ఘనుని హరిని
తెలిసిన గురువుచే • దెల్పబడిననుగాని
గననేర్తువాహరిన్ • గన్నులార
గీ॥ ఎన్నినేర్చిన యవినీకు • తెన్నుగావు
నిలిచిగనుమన్న మనసేమొ • నిలువదాయె. 98
సీ॥ అల్పజీవులయందు • నిల్పవేని కరుణ
దల్పలేవు సగుణ • దైవభక్తి
సగుణభక్తిని నీవు • సాధించలేవేని
నిర్గుణధ్యానంబు • నెఱపలేవు

నిగ్గును నెరుగంగ ♦ నేరకున్ననునీకు
జన్మసాఫల్యత ♦ జతపడదది
గానపైక్రమమున ♦ గావించుమాభక్తి
ముక్తినీయనిదియె ♦ యుక్తసరణి
గీ॥ యంచు నెరిగింప డెందమా ♦ నందపడదు
పంకజముజేతు నీకునో ♦ వారిజాక్షు... 99

సీ॥ ఈసీస శతమునే ♦ నీవిచ్చు తెలివిచే
వ్రాసి నీకర్పిస్తి ♦ వాసిమీర
భక్తులెల్లరు దీని ♦ భవహారంబనుచును
భావించి పఠియింప ♦ పరమసుఖము
పరగ నీవిప్పించి ♦ పైగ దర్శనమిమ్ము
పరమాత్మ! పరమేశ! ♦ పరమపురుష!
నిను గనుంగొనినేను ♦ నిర్వికల్పతనుండ
మది యెవ్విధంబున ♦ మనలగలదొ?
గీ॥ చూడనైయుంటి నికనాకు ♦ తోడుగమ్ము
అప్పటికినైన నామది ♦ యొప్పుకున్న... 100

సీ॥ చిత్తజజనక నీ ♦ చిత్తంబునకువచ్చు
బత్తి సలుపనేర ♦ బొత్తిగాను
జిత్తులమారినా ♦ చిత్తంబు నన్నతి
తత్తరబెట్టనా ♦ యత్తపడితి
ఎత్తెరంగుననైన ♦ నిత్తెరంగెరిగించ
దెత్తువుదాని నా ♦ పొత్తుకనుచు

గుత్తిగా నీసపు ♦ బెత్తును నీకుమే
నత్తుగా నర్పిస్తి ♦ చిత్తగించి
గీ॥ సత్తయావత్తుజూపి యో ♦ సత్యగమ్య!
చిత్తమలరారి నీయందు ♦ హత్తుకొనగ...101
సీ॥ పక్కనెక్కియు నీవు ♦ తక్కకవిచ్చేసి
యక్కజమొంద నీ ♦ యొక్కరూపు
బక్కవానియెదుట ♦ నిక్కముగాజూపు
మెక్కువేమియునిన్ను ♦ నొక్కియడుగ
మొక్కెదనీకు నే ♦ నక్కునజేర్చినగ
పక్కననవ్వించు ♦ మొక్కసారి
మిక్కలి శ్రమయేల ♦ నక్కటా నీవింక
పెక్కుమాటలనాడి ♦ సుక్కనేల
గీ॥ ఉక్కుమానిపి మదినీ ♦ చక్కనంతు
నిక్కమనవైతి వదియైన ♦ చిక్కితనదు...102
సీ॥ పెక్కుమతములిలఁ ♦ బెద్దలు కల్పించి
దేవుడున్నాడని ♦ తెలిపిరట్టి
యున్నవానినిగూర్చి ♦ యెన్నాళ్ళకైనను
సదమలమగుభక్తి ♦ సలుపవలయు
గానసేమతమైన ♦ గానిమ్ము తగుదాని
ననుభవనీయుల ♦ నడిగి తెలిసి
సగుణ నిర్గుణరూప ♦ మగుభక్తి నెదనిల్పు
సందేహములువీడ ♦ సత్యమెరుగ

గీ॥ ధ్యానమొనరించు మనస స • దా భజించి
యనిస భజియించుతు ధ్యానింతు•ననదునిన్ను.103

సీ॥ తనువు కదలనీక • తదుపరి భక్తితో
తనయిష్టదేవతా • దర్శనమున
కై నిరీక్షించుచు • కన్నులుముకుళించి
యున్న కొంతవడికి • నోడలుమరచి
తనకుతానేతన • తత్తరంబునుమాని
కదలక మదియేడ • గానలేక
నున్నతరిని జీవు • డుపొ్పాంగి మదిజేరి
దర్శించు సగుణమా • ద్వైవమూర్తి
గీ॥ సనిరి బుధులదివినియునీ • వటులొనర్చు
మంటి నిదిసులువంటినే• నైనవినదు... 104

సీ॥ నిక్కమెరిగియున్న • నొక్కటే మతమగు
బెక్కులెట్లగునవి • బక్కమనస
నిక్కమెరుగకున్న • దక్కదు మోక్షంబు
చక్కగా వెదకియం • దెక్కువెదియొ
తక్కకనేర్పుతో • గ్రిక్కున గ్రహియించి
చక్కగాదానిలో • నిక్కమెరిగి
పెక్కుగుభ్రిమలను • ద్రొక్కి పారగవైచి
వాక్కున సత్యంబ • దొక్కటునిచి
గీ॥ మొ్రిక్కుధృతిమీర స్వామికి • యొక్కసారి
దక్కు మోక్షంబు మనసన• చక్కవినదు..105

సీ॥ ఈపద్యరాశిని ♦ యేప్రొద్దు జదివెడి
భక్తసంతతికెల్ల ♦ భ్రిమదొలంగు
శుభ్రతముగావించిన ♦ కృతకృత్యులగుదురు
పరసగావించిన ♦ పాపహరము
జ్ఞప్తిలోనుంచిన ♦ జ్ఞానోదయంబగు
పరికించి చూడగా ♦ పరమునొసగు
మననంబొనర్చిన ♦ మనసుసుభ్రిక్కనుదాన
నిష్టసిద్ధియుగల్గు ♦ నిదియు నిజము
గీ॥ మర్మమెరిగించితనివిని ♦ మనసుతనదు
కర్మచాలించి నిలకున్న ♦ ధర్మనిలయ...106

సీ॥ ఆటమటించెడిమది ♦ నిటునిల్పనగునని
ధాటిగా గురుడవై ♦ మేటియైన
సూటిదెల్పినసీదు ♦ పాటవంబేమని
నోటబల్కెదనయ్య ♦ మేటిప్రభువ
ఇటుపైని నినుజూడ ♦ దిటవునాకలవడె
మటుమాయకాడనీ ♦ మాయమాయ
తటుకునజేసినీ ♦ వటుపైని విచ్చేసి
భటునిగాపాడుమో ♦ కుటిలహరణ
గీ॥ దిటవుపడనున్న నామది ♦ ఘటనజేసి
వాటముగజూపు మదికినీ ♦ మేటిరూపు...107

సీ॥ ధరశౌన ఖలగోత్రి ♦ వర అడపావంశ
జనితుడు రజతాద్రి ♦ సహజధీరు

డాతనిసతి సాధ్వి ♦ యగు నప్పమాంబకు
ముగ్గురుకొమరులు ♦ పుట్టిరందు
వేంకటనరసింహ వే ♦ దాంతి యాతని
సతిసాధ్వి పాపమ్మ ♦ జగతినట్టి
పుణ్యదంపతులకు బు ♦ ట్టిండ అప్పల
స్వామినాముడనైతి ♦ స్వామి నీదు
గీ॥ భక్తిచే ముక్తిగాంచనే ♦ యుక్తి జేయ
భక్తవత్సల నామది ♦ యుక్తమనదు
నీదుదయకొంత దానిపై ♦ నిలిపినైన
మనుపునీయందు మరులొంద ♦ మదనజనక. 103

సంపూర్ణము.



అస్మజ్జనకులగు అడపా వేంకట సరసింహదాసు
గారిచే రచియింపబడిన కీర్తనలు.

—••✿••—

అఠా ము:—ఆదితాళము.

సోహం సోహమ్మనియనుమా । అహంబ్రహ్మము ననియూజ్యోతిని యంతరాత్మను నీవుగనుమా॥సో॥

తొమ్మిది ద్వారంబులుమూసి । ఇమ్ముగా త్రికూటముజూచి । నెమ్మదిహంసను బిగిజేసి ॥ సమ్మతి మీరగ సహస్రారమున సమ్మహాత్ముని నీవు గనుమా॥సో॥

పంచాక్షరి నీమదినుంచి । అంచితభావము మది నెంచి । పంచేంద్రియముల తెగద్రుంచి ॥ ఇంచుకైన యనుమానము సేయక పంచ ప్రణవముల నీ వినుమా॥సో॥

రంగుగ రాగంబులువినుమా । అంగజ జనకుని గనుఁగొనుమా । భంగపోకసద్గుఁగనుమా ॥ గంగా యమునా సరస్వతినదులవి పొంగుచునున్నవి నీవు గనుమా॥సో॥

వాదము భేదము సేయకుమా । ఖేదము మోదము పొందకుమా । నాదంజ్యోతినిగనుఁగొనుమా॥ నాదు

బింధు కళలన్నియు గనుగొని సాధనమున నిన్నివె గనుమా॥సో॥

మూడుగుణంబులనీవిడుమా । షడపత్రింబుల నీవుజనుమా । కోడెపాము సు పోడగనుమా ॥ జడియక అడపా వేంకట నరసింహదాసుని మనవినీ వినుమా॥సోహం॥

కీర్తన— అటతాళం.

ఎంతో వేడినయాదిలేదా। లక్ష్మీకాంతా నన్నుబోవ రాదా । సంతతమునునిన్ను స్మరణజేయుచునన్న పంతమేలరనాతో పతితపావననామా॥ ఎంతో॥

శరణాని నిను వేడలేదా। నాదు దురితాములణ గింపరాదా । శరణన్నమాత్రాన కరిరాజు నేలిన దొరవాని నేనునీ దరిజేరిమరిమాకి॥ ఎం॥

జాలిలేదటరానామీదా। ఇంత జాలముతగదు యీామీాదా।చాలాభక్తిని విభీషణుడుమిము వేడిన। మేలులంకారాజ్యమిచ్చి బోవగలేదా? ॥ ఎం॥

ధరబొబ్బిలీపురవాసా । భక్తవరదా బోవర శ్రీనివాసా । గరిమతో అడపా వేంకటనారసింహుడే । మరక నీదుపాద సరసీజములమది ॥ ఎంతో॥

## కీర్తన—ఆదితాళము.

రాములవారిసేవా। సంసారాబ్ధిదాటుటకు నావా॥
రామరామయని భజించువారికి। కామితార్థములు
దారికేతొవ॥ రా॥

రాములభజనిక మరువా। యమరాయుడికిక నే
వెరువా। రామరామయని వేమరుదలచుచు నీమ
ముగామది నిల్పుముజీవ॥ రా॥

ప్రేమభేకమనుతేవా। శ్రీరామనామమనలేవా।
వేమరు అడపా వేంకట నరసింహా కామితములునో
సగుగదహావా॥ రాములవారిసేవా॥

## కీర్తన—ఆటతాళం॥

ఇంకా కరుణరాదా। దాసజన సంకటహారవాదా।
మిత్రిం॥ ఇంకాకరుణరాదా। పంకాజనేత్రినా సం
కాటములు నిరాటంకముగాబాప॥ ఇం॥

దిక్కెవ్వరిక నాకు। దీనుడనాని-మొక్కితినిక
నీకు॥ దిక్కెవ్వరికనాకు। దిక్కునీవె యనుచును।
నిక్కముగామది నెరనమ్మియుంటిని॥ ఇం॥

పరమపురుషరారా। నమ్మినననన్ను పాలింపవి
దిమేరా। నిరతము నీపాద సరసిజములమది మరి
మారివేడిన కరుణజూడవె తి॥ ఇం॥

కరుణావార్ధివిగావా। బొబ్బిలిపురవర శ్రీవాసుదేవా॥ గరిమతో అడపా వేంకట నారసింహులుని నిరతము సిరులిచ్చి కరుణజూడనైతి॥ ఇంకా॥

కీర్తన —ఏకతాళము.

దశరధనందన। దాసజనావన। దోసిలొగ్గితి వేగ రావోయి॥ ద॥

సనకసనందన సన్మునివరులను ఘనముగబ్రోచిన దేవవుగావా। మనముననినునే ఘనముగవేడితి కనకాంబరధర రావోయీ॥ ద॥

పంకజలోచన పాపవిమోచన। ఇంకా మీాదయరాదదియేమి। పొంకముగా కరి రాజునుగాచిన। వేంకటరమణిటురావోయీ॥ ద॥

సరసిజలోచన। సాగరబంధన।త్వరగాదశముఖ। శిరసంహరణా। కరుణతో విభీషణాఖ్యుని బ్రోచిన। తారకనామ వేగరావోయి॥ దశ॥

ధరణిలో శ్రీ సింహాచలమున వెలసిన నరసింహాస్వామినన్నేలవదేమి। వరహానరసింహాస్వామి నన్నేలవదేమీా। గరిమతో అడపా వేంకటనరసింహ నీ నామముగోరెను రావోయి॥ దశరధనందన॥

# నోటీసు.

మాకు రెండు పెద్ద అచ్చుఆఫీసులు కలవు. ఒక ఆఫీసు విశాఖపట్టణములోనున్ను, రెండవ ఆఫీసు పార్వతీపురములోనున్న యున్నవి. మాఅచ్చు పనులు జిల్లా జడ్జీలు, జిల్లా కలెక్టరులు, జమీందారులు, లోకల్ బోర్డ్సువారు మిగుల శ్లాఘించి వారి పనులు మాకు యిచ్చుచున్నారు. మాచే నిఘండు ప్రచురింపబడుచున్న వార పత్రిక, మాస పత్రిక ఇండియా, ఇంగ్లాండు, అమెరికా దేశములలోను వ్యాపించియున్నవి. అందువలన మా ఆఫీసులలో నెరవేర్చబడు కార్డులు, కవరలు, లెటరు పేపర్లు, విజిటింగు కార్డులు, పెండ్లి పత్రికలు మొదలగు చిల్లరపనులున్ను, ఆంగ్లాంధ్ర గ్రంధములున్ను మిగుల శుభ్రముగానున్ను, త్వరితముగానున్ను, చౌకధరలకు చేయగలమని చెప్పగలము.

కావున వలయువారు వారి అచ్చుపనులు మాకు పంపించకోరుచున్నాము.

కింగ్ అండ్ కో.,

ప్రింటర్సు అండ్ లా పబ్లిషర్సు,

విశాఖపట్టణము

స్వల్ప మూలధనము. ఫల మధికమ్ము.

## (ప్రాక్టికల్ ఇనస్ట్రక్షన్సు ఇన్ ఇంజనీరింగు)

అను పేరుగల యపూర్వ గ్రంథరత్న మొదటిభాగ మచ్చుపడు చున్నది. ఇది ఇంజనీయరింగు చదువు విద్యార్థులు, కంట్రాక్టరులు, మేస్త్రీలు, తాపీపనివాండ్రు మొదలగు సర్వజనుల కత్యంతోపయుక్తమగు గ్రంథరాజము.

ఇంకను గురుసహాయమక్కరలేకుండా మేడలు, ఇండ్లు, మఠములు మొదలుగాగల పనులయొక్క రహస్యములను తెలియుటకై చిత్రపటములతో గూడ ముద్రించుచుంటిని.

ఈ గ్రంథమునం దనుభవాంశములు పెక్కులు గలవు. ఈపుస్తకము ప్రతి బోర్డువారిచేత నామోదింపబడినది. ఇట్టి గ్రంథ మింతవరకు వెలువడియుండలేదు. చదివిచూచిన మీకే బోధపడగలదు.

గ్రంథములు కొద్దిగా నచ్చువేయించుచుండుటచే నాలస్యముచేసిన యాశాభంగమే. వలయువారికి క్రింది చిరునామాకు వెంటనే వ్రాయవలెను.

ఆడపా అప్పలస్వామి,

వెంగలరావుపేట,

విశాఖపట్టణము.